# ధ్రువతార

(పొట్టి శ్రీరాములు జీవితగాథ)

రచన

శ్రీ రావినూతల శ్రీరాములు

ప్రథమ ముద్రణ :2003
ప్రతులు .1000

(పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం ఆర్థిక సాయంతో ముద్రించబడింది)

వెల :25/-

ప్రతులకు:
శ్రీ రావినూతల శ్రీరాములు
రమణస్థాన్, వసంతపురి కాలని,
మల్కాజ్‌గిరి, హైదరాబాద్ - 500 047
ఫోన్ - 27055437

ముద్రణ:
ఎస్. వి. ఎస్. గ్రాఫిక్స్,
హైదరాబాద్ - 500 004
ఫోన్ - 56872957



# అమరజీవి

అతడు పునాదిరాయి తెలుగమ్మవరాల సరాల మేడ క
ప్రతిహత సాక్ష్యమియ్యది యభమ్ము వహించి శుభమ్ము గోరు జీ
వితకళ నుద్ధరించిన పవిత్ర చరిత్రుడు – పిల్చిపిల్చి స్వా
గతము లొసంగురా యుగయుగాలు జగాలు ప్రదం. తరాత్మకున్

ఆ మహనీయమూర్తియ కదా రుచులూరగ విశ్వసోదర
ప్రేమ సుధారసంబు గురిపించె నహర్నిశముల్ తపస్వియై
యామరణాంత దీక్షగొని, యాంధ్రిని నిల్పిన మేటి పొట్టి శ్రీ
రాములనన్ ధరాస్థలి విరాజిలు నా సుగుణాబ్ధియే కదా!

అక్షయదీక్షనంది హృదయమ్ము సమర్పణ చేసి బాపూజీ
శిక్షణ పొంది రాష్ట్ర ఫల సిద్ధికి జీవకళా కణంబులన్
భిక్షగ జేసెరా! యతని పేర ఖిలాంధ్రపతాకపై సువ
ర్ణాక్షర పంక్తులన్ దళతళా కృతులన్ వెలుగొందు చుండురా

ఏ మహనీయమూర్తి చలియించక యాంధ్ర సవిత్రి నిల్పదా
నామరణాంత దీక్షగొని యాత్మనొసంగెనొ యట్టి పొట్టి శ్రీ
రాములు వెల్గురా? తరతరంబుల జయధ్వజంబుపై c
బ్రేమ సుధారసంబు గురిపించుచు చల్లని నీడ కూర్చుచున్

ఆత్మ బలిదాన మొనరించి – ఆంధ్రరాజ్య
రథముగ దలించి సోదర ప్రజలకిచ్చి
తెలుగు వెలుగు పతాకలో నలరు తండ్రి
అందికొనుమయ్య మా హృదయాంజలులను

– కన్నెగంటి వీర భద్రాచార్యులు

# తొలిపలుకు

**Dr. I.V. SUBBA RAO,** I A S ,
Secretary to Government
Education Dept (A P)

ఆంధ్రరాష్ట్ర ఆవిర్భావానికి ముఖ్య కారకుడు అమరజీవి పొట్టి శ్రీరాములు. ఆ మహనీయుని జీవితగాథను సంక్షిప్తంగా వివరిస్తుంది ఈ చక్కటి పుస్తకము.

మహనీయుల జీవిత చరిత్రలు స్ఫూర్తిదాయకంగా ఉంటాయి. ఆంగ్లకవి H W Long Fellow అన్నట్లు "Lives of greatmen, all remind us we can make our lives sublime. And departing leaves behind us, Foot Prints on the sands of time".

మహనీయులు చూపిన బాటను అనుసరించి మనం కూడా జీవితంలో ప్రగతిని సాధించగలమనే ఆత్మ విశ్వాసం వస్తుంది. మన పూర్వీకుల తపస్సు, త్యాగఫలితమే ఈనాటి మన స్వతంత్ర భారతదేశం. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం. సత్యనిష్ఠకు, కార్య దీక్షకు మారుపేరు పొట్టి శ్రీరాములు. ఎన్ని అడ్డంకులు వచ్చినా ధైర్య సాహసాలతో తాను తల పెట్టిన కార్యక్రమం తప్పకుండ సాధించిన అమరజీవి శ్రీరాములు చరిత్ర. అదే విశాలమైన ఆకాశంలో ఎల్లప్పుడు వెలిగే ధృవతార శ్రీరాములు.

అందరికీ దిక్సూచిగా, ధైర్యాన్ని ఇచ్చి దారి చూపే చిరంతన ప్రేరణా స్రవంతి, నిఖిలమై నిలిచి ఉండే ఆ తెలుగు తల్లి ముద్దు బిడ్డ గురించి వివరించిన రచయిత. ఆత్మీయులు శ్రీరావినూతల శ్రీరాములు గారు అభినంద నీయులు. వారు ఇప్పటికే సులభసుందర శైలిలో పాఠకలోకానికి అనేక విజ్ఞాన ప్రద గ్రంథాలు అందించారు. అందిస్తున్నారు. ఈ పుస్తకం కూడా అదే భావ లహరిలో వెలువడుతున్న చక్కటి రచన. పాఠకులకు చాలా ఉపయోగపడుతుందని మన ఆంధ్రుల ఘనకీర్తిని అర్థం చేసుకునేందుకు దోహదపడుతుందని నా గట్టి నమ్మకం.

13-5-2001 ఐ.వి.సుబ్బారావు

విషయ సూచిక

# 1. దేశమూ - భాష

"త్రిలింగ దేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్

–హైడిపాటి సుబ్బరామశాస్త్రి

మన రాష్ట్రంలో మూడు ప్రసిద్ధ శివలింగాలు కల క్షేత్రాలున్నాయి. రాయలసీమలో శ్రీశైలం కోస్తా ఆంధ్రలో ద్రాక్షారామం, తెలంగాణాలో కాళేశ్వరం ఈ మూడు ప్రసిద్ధ లింగాల మధ్య దేశమే త్రిలింగ దేశమైనది.

'ఆంధ్ర' అన్నా తెలుగు అన్నా అర్థం ఒకటే అయినా దేశం గూర్చి చెప్పేటప్పుడు ఆంధ్రప్రదేశ్ యని భాషపేరు తెలిపేటప్పుడు తెలుగు భాష అని సాధారణంగా వాడుతుంటారు.

మనకు అతి ప్రాచీన గ్రంథాలు వేదాలు, వీటికి మరొక పేరు బ్రహ్మన్. బ్రహ్మన్ అంటే వేదము. బ్రహ్మన్‌కు సంబంధించినవే బ్రాహ్మణములు. వీటిలో ఐతరేయ బ్రాహ్మణము ఒకటి. దీనిలో 'ఆంధ్రపదం' ఉంది అంటే మనం వేదకాలంనాటి వాండ్ల మన్నమాట!

క్రీ.పూ. 3 శతాబ్దివాడైన అశోక చక్రవర్తి రాజ్యం భారతదేశంలో చాలభాగానికి విస్తరించి వుండేది. ఆంధ్రులు అప్పటికే స్వతంత్ర రాజ్యంగా వున్నట్లు చరిత్ర తెలుపుతుంది. ఓరుగల్లు రాజధానిగా కాకతీయ సామ్రాజ్యం 11వ శతాబ్దం నుండి 14 శతాబ్దం వరకు సాగింది. వీరి హయాంలోనే ఆంధ్రప్రదేశం ఏక ఖండంగా వుంది. వీరశైవ మతం ప్రబలింది. ప్రజాసాహిత్యం అభివృద్ధి చెందింది. వరక్తవాణిజ్యాలు విస్తారంగా జరిగాయి. మోటుపల్లి రేవు ద్వారా విదేశీ వ్యాపారంగా కూడా సాగింది.

క్రీ.శ. 1336లో విజయనగర సామ్రాజ్యం ఏర్పడింది. మూడు శతాబ్దాలు విజయవంతంగా సాగింది.

విజయనగర రాజులు హంపీ సమీపాన రాజధాని నగరం నిర్మించారు. దాని మొదటి పేరు విద్యానగరం. వారి గురువులైన విద్యారణ్యస్వామి పేరిట అది అలా పిలువబడింది. క్రమంగా విజయనగరంగా మారింది. విజయనగర పాలకులలో శ్రీ కృష్ణదేవరాయలు మిక్కిలి ప్రసిద్ధుడు. ఆయన మాతృభాష కన్నడం. అయినా ఆయనకు తెలుగు భాష అంటే వల్లమాలిన అభిమానం. 'దేశ భాషలందు తెలుగు లెస్స. అని ఆయన చాటాడు. స్వయంగా "ఆముక్తమాల్యద" అనే గొప్ప కావ్యాన్ని వ్రాశాడు.

క్రీ.శ. 1600లో ఏర్పడిన తూర్పు ఇండియా కంపెనీ వారు మనదేశంలో వర్తకం చేసుకుంటూ 1639 లో చెన్నపురి (మద్రాసు)లో కోట కట్టుకున్నారు.

స్థానిక పాలకుల తగవులలో తలదూర్చి ఆంగ్లేయులు కొద్ది కొద్దిగా భారతదేశాన్ని తమ వశం చేసుకుంటూ వచ్చారు. 1801 నాటికి ఆంధ్రదేశంలో చాలభాగం వీరి పాలన క్రిందకు వచ్చింది.

1885 నాటికి బ్రిటిష్ ఇండియా సామ్రాజ్యం ఏర్పడింది. మద్రాసు కేంద్రంగా మద్రాసు ప్రావిన్సు ఏర్పడింది. ఇందులో తమిళ, కర్ణాటక, కేరళతో పాటు బరంపురం నుండి మద్రాసు వరకు గల కోస్తా జిల్లాలు పడమటి జిల్లాలైన అనంతపురం కడప కర్నూలు బళ్లారి జిల్లా - ఆంధ్రప్రాంతం - ఆంగ్లేయపాలన క్రిందకి వచ్చింది.

ఆంధ్రదేశాన్ని గూర్చి క్లుప్తంగా తెలుసుకున్నాం. ఇక తెలుగు భాషను గూర్చి తెలుసుకుందాం.

తెలుగు అజంతభాష, అచ్చులు చివరన వుంటూ వినటానికి ఇంపుగా వుంటుంది. తెలుగు వామావర్తన లిపి. అంటే ఎడమ వైపుకు సాగుతుంది. వామవర్తన లిపి అంబిక (అమ్మవారికి) ప్రీతి కలిగించేది.

తెలుగు వారు తమ పిల్లలకు అక్షరాభ్యాసం

"ఓం నమః శివాయ" తో మొదలు పెడతారు. ఇది చాల శక్తివంతమైన పంచాక్షరీ మంత్రం. ఇది యజుర్వేద మధ్యమంలో వుంది.

కంచి పీఠాధిపతులు పరమాచార్య చంద్రశేఖర సరస్వతి స్వామివారు.

"దేశము త్రిలింగ దేశము. లిపి అంబికకు ప్రీతి కలిగించే వామావర్తం. ప్రజలు ఎక్కువమంది యజుశ్శాఖవారు. అక్షరాభ్యాసం పంచాక్షరితో మొదలవుతుంది. ఇన్ని విశేషాలు గల ఆంధ్రులను మించిన భాగ్యశాలురెవరు?" అంటారు.

తమిళ దేశంలో అప్పయ్య దీక్షితుడనే మహా పండితుడు కొన్ని శతాబ్దాల క్రిందట వుండేవాడు. "ఎంతో పుణ్యం చేసుకుంటే గాని ఆంధ్రదేశంలో పుట్టడం సాధ్యపడదు". అని చెప్పాడు. తనకు ఆ భాగ్యం కలుగలేదని విచారపడినాడు కూడా!

తమిళదేశంలో పుట్టిన మహాకవి సుబ్రహ్మణ్య భారతి. ఆయన వ్రాసిన ఒక దేశ భక్తగీతంలో 'సుందర తెనుంగ్ (సుందరమైన తెనుగు) అని వ్రాశారు.

# 2. ఆంగ్ల పాలనలో

పరతంత్ర జనముల పాలి కష్టంబు
చెప్పంగ నలవియే శివునికి నైన
- శ్రీనాథమహాకవి

బ్రిటీషు వారు మన దేశాన్ని రెండు వందల సంవత్సరాలు - 1750 నుండి 1947 వరకు పాలించారు. విదేశీ పాలనలో జరిగిన భారీ నష్టాలు ప్రక్కన పెడితే రెండు లాభాలు కలిగాయి. వందల సంవత్సరాల నుండి దేశంలో కొరవడిన శాంతి వాతావరణం ఏర్పడింది. రాజకీయ ఐక్యత కుదిరింది. రెండవది 1857 లో ఆంగ్ల విద్యా విధానం ప్రారంభమైంది. పాశ్చాత్య పద్ధతిన భారతీయులలో జాతీయ చైతన్యానికి ఆస్కారమైంది. ఫలితంగా స్వాతంత్ర్య పోరాట కాలంలో ఆయుధంగా ఉపయోగపడిన భారత జాతీయ కాంగ్రెసు పుట్టుకొచ్చింది. ఉదార భావాలు కలిగిన హ్యూమ్, వెడ్డన్‌బర్న్ కాంగ్రెసు ప్రారంభ దినాలలో చురుగ్గా పాల్గొన్నారు. దేశంలో ప్రజా స్వామ్య వ్యవస్థ బలపడాలని వారు ఆకాంక్షించారు.

20వ శతాబ్దినుండి మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు కావలెననే కోరిక ప్రజలలో బలంగా వుంటూ వచ్చింది. ఏదో కారణంగా చాలకాలం అది కార్యరూపం దాల్చలేదు. మద్రాసు ప్రెసిడెన్సీలోని ఆంధ్రులు ఎన్ని రంగాలలో పురోగమించినా ఇతర ప్రాంతాలవారు ఆంధ్రులను మద్రాసీలు అనే పిలుస్తూ వచ్చారు. ఇది ఒక న్యూనతగా తెలుగువారు భావించసాగారు. ప్రత్యేక రాష్ట్రంలోనే ఆంధ్రులు తమ వ్యక్తిత్వ వికాసం సాధ్యమని గుర్తింపసాగారు

# 3. ఆంధ్రోద్యమ బీజాలు

చేయెత్తి జైకొట్టు తెలుగోడా
గతమెంతో ఘనకీర్తి కలవాడా
సాటిలేని జాతి ఓటమెరుగని ఖ్యాతి నివురుగప్పి నేడు నిదురపోతుండాది
జై కొట్టు మేలుకొల్పు తెలుగోడా

—వేములపల్లి శ్రీ కృష్ణ

ఆంధ్ర రాష్ట్ర వాంఛకు మూలకారణం 1905 నాటి బెంగాల్ విభజనేనని చెప్పవచ్చు. రాష్ట్రం పెద్దదిగా వున్నదనే సాకుతో పాలనా సౌలభ్యం పేరుతో బెంగాలీ మాట్లాడే బెంగాల్ రాష్ట్రాన్ని రెండుగా చీల్చారు. ఈ విభజన బెంగాల్ వాసులు తీవ్రంగా వ్యతిరేకించారు. దేశంలోని అన్ని భాషల వారు బెంగాలీలకు అండగా నిలిచారు. ఇదే 'వందేమాతరం' ఉద్యమంగా మారింది. యువకులలో స్వాతంత్ర్యకాంక్ష బలపడేటట్లు చేసింది.

1901లో గుంటూరు యువకులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, జొన్నవిత్తుల గురునాథం ఆంధ్రులకొక రాష్ట్రం గూర్చి చర్చించారు. శ్రీ చల్లా శేషగిరిరావు గుంటూరి నుండి వెలువడే 'దేశాభిమాని' పత్రికలో చర్చల సారంశం ఒక వ్యాసంగా ప్రచురించారు.

1911 లో బెంగాల్ నుండి బీహారును వేరు చేస్తూ భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సముచితము అనే సూచన ఇండియా సెక్రటరీ చేశారు. ఇదే ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి నాంది ప్రస్తావన అయింది.

1912 మే 22న నిడుదవోలులో ఐక్య కృష్ణాజిల్లా సమావేశం

జరిగింది. కృష్ణా గుంటూరు గోదావరి జిల్లాలకు కలిపి మద్రాసు లెజిస్లేటివు కౌన్సిల్‌లో ఒకే స్థానం వుండేది. ఆ సభలోనే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలని ప్రతిపాదన చేస్తే అధ్యక్షులు శ్రీ వేమవరపు రామదాసు పంతులు - అది విషయ నిర్ణాయక సభలో లేదని చెప్పి - నిరాకరించారు.

మరునాడు కొందరు యువకులు గోదావరి నదిలో స్నానం చేస్తుండగా చట్టి నరసింహారావు ఎందరో ఆంధ్ర ప్రముఖులు ఇక్కడ సమావేశమయినారు కదా! ఏటా వీరిని ఒకచోట చేర్చి ఆంధ్ర మహా సభ జరిపితే బాగుంటుందని సూచించారు.

తరువాత కొంత కాలానికి గుంటూరు ప్రముఖులు వింజమూరి భావనాచార్యులు గారి యింటిలో ఉన్నవలక్ష్మినారాయణ, చల్లా శేషగిరిరావు, జొన్నవిత్తుల గురునాథం సమావేశమై కొండా వెంకటప్పయ్యగారిని రప్పించారు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం ఆవశ్యతకను గూర్చి దేశ భక్తునికి వివరించారు. ఆయన చివరకు సమాధానపడి 'ఆంధ్రోద్యమం' అన్న కరపత్రం స్వయంగా వ్రాసి యిచ్చారు.

అదే కాలంలో జొన్న విత్తుల గురునాథం, ఉన్నవ లక్ష్మినారయణ గార్లు ఆంధ్రదేశపు రాజకీయ పటాన్ని రూపొందించారు. చెన్న రాష్ట్రంలోని తెలుగు జిల్లాలే గాక నిజాం రాష్ట్రంలోని తెలంగాణా కూడా ఇందు చేర్చడం వారి ఉత్సాహాన్ని తెలుపుతున్నది.

గుంటూరి నుండి వెలువడే ఆంధ్ర అనే పత్రిక ద్వారా జొన్న విత్తుల గురునాథం 'హిందూ' పత్రిక ద్వారా డాక్టరు పట్టాభి సీతారామయ్య వ్యాసాలు వ్రాసి ఆంధ్రోద్యమానికి దోహదం చేశారు.

1913 మే 26న బాపట్లలో మొదటి ఆంధ్రమహాసభ జరిగింది. 800 మంది ప్రతినిధులు ఇందులో పాల్గొన్నారు. శ్రీ బి.ఎన్. శర్మగారు అధ్యక్షత వహించారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య గారు ఆహ్వాన సంఘ అధ్యక్షులు. తెలుగు జిల్లాల కొరకు రాష్ట్రం ఏర్పాటు గూర్చి ప్రభుత్వాన్ని కోరవచ్చునా! అనే విషయంపై అభిప్రాయం సేకరణకు తీర్మానించారు. ఇందుకు గాను ఒక ఉప సంఘం వేశారు.

రాయలసీమ (అప్పుడు దత్తమండలాలనేవారు) ప్రత్యేక రాష్ట్ర నిర్మాణానికి వ్యతిరేకులంటూ గుత్తి కేశవ పిళ్లైవాదించారు.

1914 లో దేశోద్దారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు ఆంధ్ర పత్రిక దిన పత్రికగా మద్రాసు నుండి ప్రారంభించారు. ఆంధ్రులు తమ అభిప్రాయ ప్రకటనకు ఆంధ్ర పత్రిక చక్కని వేదిక అయింది.

ఈ సంవత్సరమే రెండవ ఆంధ్ర మహాసభ బెజవాడలో జరిగింది. అధ్యక్షులు 'ఆంధ్రభీష్మ' న్యాయపతి సుబ్బారావు పంతులు గారు. తెలుగు జిల్లాలను ఒక రాష్ట్రంగా ఏర్పాటు వాంఛనీయమని తీర్మానించారు.

1915లో విశాఖ పట్టణంలో పానుగల్లు రాజా అధ్యక్షతన మూడవ ఆంధ్ర మహాసభ కూడ ప్రత్యేక రాష్ట్ర వాంఛను పునరుద్ఘాటించింది.

1916లో కాకినాడలో శ్రీ మోచర్ల రామచంద్రరావు అధ్యక్షతన నాల్గవ ఆంధ్ర మహాసభ జరిగింది. తెలుగు యువకులు సైన్యంలో చేరి తమ పౌరుషం ప్రదర్శించాల్సిందిగా తీర్మానించారు.

# 4. ఫలించిన ప్రబోధం

1917లో ఆంధ్ర మహాసభ నెల్లూరులో కొండా వెంకటప్పయ్య గారి అధ్యక్షతన జరిగింది. కొందరు నెల్లూరు ప్రముఖులు రాష్ట్ర నిర్మాణానికి విముఖత కనపరిచారు. మహా సభ విఫలం కాగలదని కూడా కొందరు భయపడినాడు. 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాల కృష్ణయ్య అక్కడనే వున్న ఆచార్యరాయప్రోలు సుబ్బారావును ఒక ప్రబోధ గీతాన్ని వ్రాయమని కోరారు.

పెన్నానది ఒడ్డున రాయప్రోలు వారు "అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ విద్యాలయములు స్థాపించునాడు". అంటూ చక్కని సీస పద్యం వ్రాశారు.

'ఆంధ్రరత్న' మర్నాడు ఆంధ్రమహాసభ ప్రారంభ సమయాన ఈ పద్యాన్ని రాగయుక్తంగా తన మధుర కంఠంతో గానం చేసి సభాసదులను ఉత్తేజపరిచారు. సభ జయప్రదంగా ముగిసింది. ముక్త కంఠంతో రాష్ట్ర వాంఛ పునరుద్ఘాటిస్తూ తీర్మానించారు. అధ్యక్షులు కొండా వెంకటప్పయ్య గారు భాషా రాష్ట్రాల ఆవశ్యకత గూర్చి విజ్ఞానదాయకంగా మాట్లాడారు. ఆయన ప్రసంగం ఇలా సాగింది.

"ఒక భూభాగమును ఆక్రమించుకొని ఒక భాషను మాట్లాడు జనులను ఒక రాష్ట్రంలో చేర్చుటచేత పరిపాలనా సుకరమును సౌష్టవమున అగును. భాషోన్నతి జనుల ఔన్నత్యమును ప్రకటించును. జనుల యాధిక్యమును భాషలో ప్రతిబింబితమగును. ఇట్లు ప్రజలకు భాషకును

నిరంతరమగు అన్యోన్య సంబంధము కలదు శరీర పోషణకు ఆహార పదార్థము లెట్లో బుద్ధి వికాసమునకు జ్ఞానమునట్టిదే ! సాధారణముగ భాషా మూలకముగనే జ్ఞాన మలవడును భాష నభివృద్ధి చేసిన కొలది దాని నభ్యసించు జనులు అభివృద్ధి నందెదరు. భాష ఐకమత్యమునకు సాధనము. జనులకు చరిత్రము విజ్ఞానము కలుగు భావములను సంప్రదాయములను అమూల్యమగు విత్తనములు అట్టి భాషా గర్భమున నుండుట చేత భాష జనులలో అసదృశ్యమగు అన్యోన్య భావము కలుగును''.

1917 కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు, భాషా ప్రాతిపదికపై కాంగ్రెసు సంఘాలు ఏర్పడాలని తీర్మానించింది. ఫలితంగా 20-1-1918 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటైనది. ఇందుకు సంబంధించిన ఒక చమత్కార ఘటన.

ఒకసారి కాంగ్రెసు కార్యవర్గం సమావేశం జరుగుతుంది. భాషా రాష్ట్రాలను గూర్చి చర్చిస్తున్నారు. గాంధీ, నెహ్రూ మొదలయిన పెద్దలంతా అక్కడే వున్నారు. అసలు ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం ఎందుకో అని ఒకరు వెటకారంగా మాట్లాడారు అప్పుడు డాక్టరు పట్టాభి తన జేబులో నుండి ఒక అణాకాసు తీసి బల్ల మీద వేశారట. అందరూ తెల్లబోయారు. వెటకారంగా మాట్లాడిన వ్యక్తి సిగ్గుతో తలదించుకున్నాడు. బ్రిటిష్ ప్రభుత్వం చలామణి చేసిన నాణెంలో ఇంగ్లీషు కాకుండా దేశ భాషలు నాలుగే వున్నాయి. అందులో ఒకటి తెలుగు.

తెలుగు వారి ప్రత్యేకత ఏమిటో అందరికీ తెలిసి వచ్చింది

# 5. ఆంధ్రోద్యమం మజిలీలు

1917 లోనే కలకత్తాలో అనిబి సెంటు అధ్యక్షతన జరిగిన కాంగ్రెసు మహాసభ ఆంధ్ర ప్రాంతానికి ప్రత్యేక ప్రదేశ్ కాంగ్రెసు సంఘ ఏర్పాటుకు అంగీకరించింది. మద్రాసు నగరం పై ఆంధ్రులకు తమిళులకు సమష్టి హక్కును కలుగజేసింది. 1920 లో మహాత్మగాంధీ అధ్యక్షతన నాగపూర్ లో జరిగిన కాంగ్రెసు మహాసభలో భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం కోరుతూ తీర్మానం చేయబడింది.

1927లో వేమవరపు రామదాసు పంతులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తగు చర్యలు తీసుకొనవలసిందిగా కేంద్ర శాసన సభలో కోరారు.

1928లో సైమన్ కమీషన్ను బహిష్కరించుటలో ఆంధ్రులు ప్రముఖ పాత్ర వహించారు. మద్రాసులో బ్రిటీష్ తుపాకులకు ఎదురొడ్డి ఆంధ్రకేసరి ప్రకాశం చరిత్ర సృష్టించారు.

ఆంధ్రులు జాతీయోద్యమం పై దృష్టి నిలుపగా పర్లాకిమిడి మహారాజా [illegible]ష్ వారితో సహకరించి ఒరిస్సా రాష్ట్రం సాధించారు.

1931లో లండన్ వెళ్లుతూ వుండిన మహాత్మగాంధికి రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో ఆంధ్రరాష్ట్రం గూర్చి ప్రస్తావించమని కొరుతూ డాక్టరు పట్టాభి, అయ్యదేవర కాళేశ్వరరావు గార్లు మెమొరాండం సమర్పించారు.

1937 లో మద్రాసు రాష్ట్రానికి రాజాజీ ప్రధాని (అప్పుడు

ముఖ్యమంత్రిని ప్రధాని అనే వారు)గా ఎన్నికైనాడు. తన మంత్రి వర్గంలో రాయలసీమకు చెందిన కడప కోటి రెడ్డిని కాదని నెల్లూరు వారైన బెజవాడ గోపాలరెడ్డిని మంత్రిని చేశారు.

1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడింది. దాని కేంద్ర స్థానం మొదట అనంతపురంగా నిర్ణయించి తరువాత వాల్తేరులో స్థిరపరిచారు. ఇలాంటి సంఘటనలతో రాయలసీమ వారికి కోస్తా ఆంధ్రులపై అనుమానాలు అధికమయినాయి.

ఈ లోగా 1937 అక్టోబరులో బెజవాడలో ఆంధ్ర మహాసభ స్వర్ణోత్సవాలు వైభవంగా జరిగాయి. ఆ సభలోనే తమకు ప్రత్యేక రక్షణలు కావాలని రాయలసీమ నాయకులు కడప కోటి రెడ్డి, పప్పూరిరామాచార్యులు మొదలగు వారు కోరారు. ఫలితంగా మద్రాసులోని శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు భవనం 'శ్రీబాగు'లో కోస్తా ఆంధ్ర నాయకులకు రాయలసీమ నాయకులకు మధ్య ఒప్పందం కుదిరింది. ఇదే శ్రీ బాగుపాక్టుగా ప్రసిద్ధమయింది. రాయలసీమలో వారు రాజధానిగానీ హైకోర్టుగాని ఏది కోరితే దానిని రాయలసీమ ఏర్పాటు చేయాలని ఈపాక్టులోని మొదటి షరతు. ఇలాంటివే మరికొన్ని.

1938 మార్చిలో మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీలో కొండా వెంకటప్పయ్యగారు, లెజిస్లేటివు కౌన్సిల్‌లో కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు చెన్న రాష్ట్రాన్ని తమిళ, తెలుగు, కన్నడ, మలయాళ రాష్ట్రాలుగా విభజించాలని తీర్మానాలు ప్రవేశపెట్టారు.

ప్రభుత్వం పక్షాన ప్రధాని రాజాజీ వీటిని బలపరచారు. కాని బ్రిటీషు ప్రభుత్వం వీటిని మన్నించలేదు.

1941 నుండి 1946 వరకు ఆంధ్ర మహాసభ అధ్యక్షులుగా వున్న విజయనగరం మహారాజకుమార్ ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి విశేష కృషి చేశారు.

మద్రాసు గవర్నరు అర్దరు హోప్‌తోను, సర్ స్టాఫర్టు క్రిప్సుతోను సంభాషణలు జరిపి వారి సానుభూతి సంపాదించారు.

1946 లో మద్రాసు ప్రధానిగా వున్న ఆంధ్రకేసరి ప్రకాశం ఆంధ్రరాష్ట్ర తీర్మానం ప్రతిపాదనలో వుండగనే పదవి కోల్పోయారు.

ప్రముఖ న్యాయవాధి అల్లాడి కృష్ణస్వామి ఆంధ్రరాష్ట్ర నమూనా ఉత్తర్వు తయారు చేశారు. దీనిని రాజ్యాంగ చట్టంలో రూపొందించాలనే కళా వెంకట్రావు, అనంతశయనం అయ్యంగార్ల కృషి ఫలించలేదు.

తరువాత వచ్చిన ధార్ కమిటీ భాషా ప్రయుక్త రాష్ట్రాలు వాంఛనీయం కాదని సూచించింది కానీ మద్రాసు నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలని సూచించింది.

ఈ సూచనలు కేంద్రంలోని పెద్దలకు అంగీకారంగా లేదు. జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయి పటేల్ డా|| పట్టాభిలతో కమిటీ ఏర్పాటుచేసింది. ఈ కమిటీ 1949 లో మద్రాసు లేకుండా ఆంధ్రరాష్ట్ర నిర్మాణాని సిఫార్సు చేసింది. ప్రభుత్వం ఈ సిఫార్సులను అంగీకరించి విభజనకు కమిటి నియమించింది. అందులో సభ్యులైన ఆంధ్ర కేసరి ప్రకాశం

అసమ్మతి ప్రకటించడంతో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ ప్రతిపాదనలకు స్వస్తి చెప్పారు.

1951 ఆగష్టు 16న స్వామి సీతారాం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ప్రాయోపవేశం చేశారు. 30 దినాల పిమ్మట ఆచార్య వినోబా భావే విజ్ఞప్తి మేరకు స్వామిజీ దీక్ష విరమించారు.

1951 జనరల్ ఎన్నికలలో ఆంధ్ర ప్రాంతంలోని 140 శాసన సభా స్థానాలలో కాంగ్రెసు 40 స్థానాలు మాత్రమే సాధించింది.

మద్రాసు అసెంబ్లీలో తెన్నేటి విశ్వనాథం, వావిలాల గోపాలకృష్ణయ్య గార్లు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలంటూ తీర్మానాలు ప్రవేశపెట్టారు. రాజ్య సభలో పైడా వెంకటనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య గార్లు ఇదే మాదిరి తీర్మానాలు ప్రవేశపెట్టారు.

అప్పటి మద్రాసు అసెంబ్లీలో పరిస్థితి గూర్చి వావిలాల 'విశాలాంధ్ర' గ్రంథంలో ఇలా వివరించారు.

"ప్రాంతీయ అసెంబ్లీలలో ఎవరికి వారు ముఖ్యంగా వయోజన వోటు విధానం వచ్చిన తర్వాత మాతృభాషలో మాట్లాడకపోతే స్వరాజ్యం సురాజ్యం కాజాలదు. సామాన్య జనం శాసన సభలకు వస్తారు. తమిళులు ఆంధ్రులు, మలయాళీలు, కర్ణాటకులు ఎవరి భాషలో వారు మాట్లాడితే ఎవరికీ ఏమి అర్థంకాని స్థితి ఏర్పడుతుంది. చూచిన వారికి మూగ చెవిటివారి ముచ్చటగ కన్పించుతుంది. 1952 మార్చి నెలలో మద్రాసు అసెంబ్లీలో ఈ ప్రదర్శనాన్ని రుచి కూడా చూడగలిగాం. ప్రతి సభ్యుడు పొరుగు సభ్యుడు

చెప్పింది వినుటకు లేక తాను విన్పించుటకు హక్కు వున్నదనేది అందరికీ తెలిసిందే! సభలో సంగతులు విని ఆనందించవలెనంటే తెలియనప్పుడు రేగి చెట్టుక్రింద గుడ్డివాని ఆనందం అనుభవించవలసి వస్తుంది".

ప్రధాని నెహ్రూ మద్రాసు నగరం గూర్చి అన్ని పక్షాలు ఒక అవగాహనకు రావలెనని తెలిపారు. ఇందరు మహామహులు ఇన్ని సంవత్సరాలు కృషి చేసినా ఆంధ్ర ప్రజల వాంఛనెరవేరలేదు.

అందుకు ఒక మహాపురుషుని ఆత్మ త్యాగం అవసరమయింది. అట్టి బలిదానం చేసిన కారణజన్ముడే పొట్టి శ్రీరాములు. ఆ యోగి చరిత్ర ఆంధ్రులకు ప్రాతః స్మరణీయము. ఆయన జీవితగాధ ఆసాంతము త్యాగమయము.

***

# 6. బాల్యం - విద్యాభ్యాసం



పొట్టి గురవయ్య, మహాలక్ష్మమ్మ అనే పేద దంపతులు 19వ శతాబ్ది చివరకు మద్రాసు మహానగరం చేరారు. వారు మద్రాసు రాకముందు కొంతకాలం పొన్నేరి సమీపాన గల "న్యాయపాలెం"లో నివసించారు. వీరి పూర్వుల స్థావరం నేటి ప్రకాశం జిల్లా కనిగిరి మండలం పడమటి పల్లి. మద్రాసు నగరంలోని జార్జి టౌనులో అణ్ణాపిళ్ళై వీధి డోరు నెం.-163 ఇంటిలో నివసిస్తున్న కాలంలో 1091 మార్చి 16న ఫాల్గుణ బహుళ ఏకాదశి నాడు వీరికి జన్మించిన మగబిడ్డకు ఆ దంపతులు 'శ్రీరాములు' అని నామకరణం చేశారు.

అయిదవ యేట అక్షరాభ్యాసం పిమ్మట శ్రీరాములును ప్రాథమిక పాఠశాలలో వేశారు. ఆ దినాలలో పెద్దబాల శిక్షతో చదువు మొదలయ్యేది. కొద్దికాలంలోనే బమ్మెర పోతన భాగవతంలోని గజేంద్రమోక్షం పద్యాలు, బాలరామాయణ శ్లోకాలు శ్రీరాములుకు కంఠతా వచ్చేశాయి.

కష్టించి పనిచేయడం, ఓర్పు, దానగుణం లాంటి సుగుణాలు శ్రీరాములకు బాల్యంలోనే తల్లి ప్రభావం వల్ల అలవడినాయి. హైస్కూలు విద్యార్థిగా కూడా శ్రీరాములు తన ప్రతిభను కనబరిచారు. భారత భాగవతాలన్నా శ్రీరాములకు ప్రత్యేక అభిమానం. పాఠశాల వేళలు ముగియగానే గ్రంధాలయానికి వెళ్ళడం శ్రీరాములకు నిత్యకృత్యమయింది.

భారతీయ యుగ పురుషుల చరిత్ర గ్రంథాలు ఆయన ఎంతో ప్రీతితో చదివేవాడు. ఫలితంగా దేశ స్వాతంత్ర్య గూర్చి తరచూ ఆలోచించేవాడు.

శ్రీరాములు గారి తల్లి రెక్కలు ముక్కలు చేసుకొని కుమారునికి ఏ లోటూ లేకుండా చూసేది. తనలోని సుగుణాలన్నిటికీ తల్లి ప్రభావమే కారణమని తరువాతి కాలంలో శ్రీరాములు చెప్పేవాడు. కళాశాల విద్యార్థిగా అమెరికా అధ్యక్షులుగా పనిచేసిన అబ్రహాం లింకన్ ప్రసిద్ధ ఆంగ్లరచయితలు జార్జి బెర్నార్డుషా, షేక్స్పియరు రచనలు శ్రీరాములు విరివిగా చదివేవాడు. ఈ దశలోనే స్వాతంత్ర్య ఉద్యమం ఉధృతమయింది. ఒక దశలో చదువు మానివేసి ఉద్యమంలో పాల్గొనవలెనని తలపోశాడు శ్రీరాములు. కానీ పెద్దల సూచన మేరకు విద్యాభ్యాసం కొనసాగించాడు. శానిటరీ ఇంజనీరింగ్ కోర్సులో ఉత్తీర్ణుడైనాడు. అనతి కాలంలోనే బొంబాయిలోని జి. ఐ. పి. రైల్వేలో నెలకు రూ 130/ జీతంపై ఉద్యోగం దొరికింది.

## వివాహం - కుటుంబదీనగాథ

శ్రీరాములు గారికి 1922 లో పెండ్లి అయింది. వధువు మేనమామ మారెళ్ల నివాసి గునుపూడి నర్సయ్యశెట్టి కుమార్తె లక్ష్మమ్మ. వరుడు

శ్రీరాములు కాబట్టి అతని పేరుకు తగినట్లుగా భార్య పేరు సీతమ్మ అని మార్చారు. పురాణ దంపతుల వలెనే సీతమ్మ శ్రీరాములు దాంపత్యం అన్యోన్యంగా కొంతకాలం సాగింది. ఒక కుమారుడు కూడా వీరికి కలిగాడు. 5వ రోజునే ఆ బిడ్డ చనిపోయాడు.

1925 లో శ్రీరాములు తనకు ఉద్యోగం రాగానే భార్యను తీసుకొని వెళ్ళి బొంబాయిలో కాపురం పెట్టాడు. తండ్రి అప్పటికే మరణించారు. నాలుగేండ్లు మాత్రమే ఆయన ఉద్యోగంలో కొనసాగాడు. ఈ కాలంలోనే ముందుగా తల్లి తరువాత క్షయ వ్యాధితో భార్య 1929 లో కన్ను మూశారు. కుటుంబం కకావికలైపోవడం శ్రీరాములను కలచివేసింది. అతనిలో వైరాగ్యం పరాకాష్ఠకు చేరుకుంది. సమాజానికి ఆయన సేవలు నిరాటంకంగా జరగాలని దైవ నిర్ణయం కాబోలు! తన వారందరు దూరమయినారని శ్రీరాములు తనకు తాను సమాధానపరుచుకున్నాడు. తనకంటూ ఏమి కోరని శ్రీరాములు తన శక్తి సామర్థ్యాలు లోక కళ్యాణానికి వినియోగించాలని గాఢంగా నిర్ణయించుకున్నాడు. ఒక శుభదినాన ఉద్యోగానికి స్వస్తి, చెప్పి గాంధీజీ సబర్మతీ ఆశ్రమానికి తరలివెళ్లాడు. అప్పుడు శ్రీరాములు 28 ఏండ్ల యువకుడు.

* * *

# 7. సబర్మతి ఆశ్రమంలో రాములు భాయి




1915 మే 25 న మహాత్మాగాంధీ అహ్మదాబాద్ సమీపంలోని కొచ్రాబ్ గ్రామంలో సత్యాగ్రహ ఆశ్రమం ఏర్పాటు చేశారు. ప్లేగు వ్యాపించిన కారణంగా కొంతకాలానికి అక్కడ నుండి నాలుగు మైళ్ళ దూరంలో వున్న సబర్మతి నదీ తీరాన గల స్థలానికి ఆశ్రమాన్ని మార్చారు.

అహ్మదాబాదు మిల్లు పనివారల సమ్మె సందర్భంగా తొలిసారిగా మూడు దినాలు గాంధీజీ నిరాహార దీక్ష పూనినదీ ఆశ్రమంలోనే! 1930 లో చారిత్రాత్మకమైన దండి ఉప్పు సత్యాగ్రహాన్ని సబర్మతి నుండే గాంధీజీ ప్రారంభించారు. ఆ బృందంలో ఇరువురు ఆంధ్ర సోదరులుండటం గర్వకారణం. కృష్ణా జిల్లా అంగలూరికి చెందిన ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు

అప్పటికే సబర్మతి ఆశ్రమంలో వుండేవారు. సీతానగరం గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమ ప్రతినిధిగా చండ్రపట్ల హనుమంతరావు ఈ యాత్రలో పాల్గొన్నారు. ప్రముఖ హరిజన నేతలు వేముల కూర్మయ్య గారు 1925 - 27లో నూలు వడకడం, నేత నేయడంలోను సబర్మతి ఆశ్రమంలో శిక్షణ పొంది వచ్చారు. 1921 లోనే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం కృష్ణా జిల్లా యువకుడైన పేట బాపయ్యను శిక్షణ నిమిత్తం పంపింది.

1930లో సబర్మతి చేరే ముందు శ్రీరాములు తన సోదరుడైన డాక్టరు రంగయ్య (నెల్లూరు)కు ఒక లేఖ వ్రాస్తూ తన జీవితాన్ని ప్రజాసేవకు అంకితం చేస్తున్నానని తెలియచేశాడు.

1930 ఏప్రిల్ 1న సూరత్ లో మహాత్మాగాంధీని కలిసి సబర్మతి వెళ్లాడు: శ్రీరాములు 1930 నుండి 1933 వరకు సబర్మతిలో వుండి ఆశ్రమ వాసుల అభిమానం చూరగొన్నాడు. అక్కడ వారతనిని శ్రీరాములు అని కాక "రాములు భాయ్" అని పిలువసాగారు. తనకు నిర్దేశించబడిన కార్యక్రమాలు నిజాయితీతో ఆయన నిర్వహించేవాడు. మితభాషి, నిరాడంబరుడు, కార్యదీక్షాపరుడైన శ్రీరాములును సన్నిహితంగా గమనిస్తూ వుండిన మహాత్ముడు ఒకనాటి ప్రార్థనా సమావేశంలో ఇలా చెప్పారు. "శ్రీరాములు గారిలాంటి క్రమశిక్షణ, పట్టుదల, దీక్షగల ఆదర్శ ప్రజాసేవకులు పదిమంది లభిస్తే స్వరాజ్య ప్రాప్తి అనుకున్న దానికంటే ముందుగా లభిస్తుంది".

గాంధీజీ తన సహచరులతో తల పెట్టిన ప్రదర్శన సందర్భంగా ఆశ్రమ వాసులతో పాటు శ్రీరాములు 1933 ఆగష్టులో జైలు శిక్షకు గురి అయినాడు. ఒకనెల రోజులు సబర్మతి జైలులోనూ అయిదు నెలలు నాసిక్

జైలులోను ఆయన గడిపాడు. సబర్మతి ఆశ్రమం కార్యదర్శిగా పనిచేసిన నారాయణ్ దాస్‌గాంధి శ్రీరాములుకు చేరువ అయినాడు. 1934 లో బీహారు భూకంప బాధితుల సేవలో శ్రీరాములు గారి కృషిని ఆయన మెచ్చి రాజకోటలోని ఆశ్రమానికి శ్రీరాములును ఆహ్వానించాడు.

రాజకోటలో ఖాదీ ఉత్పత్తిలోను వీధులూడ్చటంలోను మురికివాడలు పరిశుభ్రమొనర్చడంలోను ఆయన శ్రద్ధవహించాడు. రాజకోట నుండి 'తరవాడ' గ్రామానికి వెళ్లిన శ్రీరాములు, అక్కడ రైతు కూలీల సంక్షేమానికి అవిరళ కృషి సలిపాడు. ఆమ్రేలీలో సర్దార్ వల్లభాయి పటేల్ స్థాపించిన శ్రమజీవి సంఘంలో శ్రీరాములు కొంత కాలం పనిచేసిన గుజరాతు ప్రజలకు ప్రేమాస్పదుడైనాడు.

***

# 8. కొమరవోలు ఆశ్రమంలో

గాంధీజీని దండియాత్రలో అనుసరించిన దండి సత్యాగ్రహి ఎర్నేని సుబ్రహ్మణ్యం గారి స్వస్థలం అంగలూరు. గుడివాడ సమీపాన గల కొమరోలులో గాంధీ ఆశయాల సాధనకు ఉపకరించే ఆశ్రమం నెలకొల్పారు. కాంగ్రెసు అధ్యక్షులుగా నున్న బాబూరాజేంద్ర ప్రసాదు దీనిని ప్రారంభించారు. ఎర్నేని సుబ్రహ్మణ్యంగారిని గాంధీజీ శిష్యులు సాధు సుబ్రహ్మణ్యం అని పిలిచే వారు. ఆయన శ్రీరాములును తనతో కలిసి పని చేయవలసిందిగా ఆహ్వానించారు. కొమరోలు ఆశ్రమంలో సాధు సుబ్రహ్మణ్యంతో శ్రీరాములు గారు నిర్మాణ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనేవాడు. యువకులకు చక్కని శిక్షణ నిచ్చేవాడు. పరిసర గ్రామాలలో తరచూ అన్ని వర్ణాల వారితో సహపంక్తి భోజనాలు జరిపేవాడు. హరిజనోద్ధరణకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చేవాడు.

# 9. సాధు సుబ్రహ్మణ్యం



ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా మహాత్మాగాంధీ 1930 మార్చిన సబర్మతీలో బయలుదేరి ఏప్రిల్ 5న 'దండి' చేరారు. ఆనాటి సత్యాగ్రహ బృందంలో ఆంధ్రులయిన శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం ఒకరు. ఆయనను సాధు సుబ్రహ్మణ్యం గారని పిలుస్తారు. సబర్మతీలో కొంతకాలం గడిపిన సాధుజీ ఆంధ్రదేశానికి వచ్చారు.

1931 అక్టోబరు 2 (గాంధీ జయంతి) నాడు కొమరవోలులో గాంధీ ఆశ్రమం నెలకొలిపారు. అసహాయోద్యమంలో ఆశ్రమాన్ని ప్రభుత్వం ధ్వంసం చేసింది. 1935లో సాధుజీ దీనిని పునర్నించి బాబూ రాజేంద్రప్రసాద్ చేత ప్రారంభింప చేశారు.

సబర్మతిలో పరిచయమైన పొట్టి శ్రీరాములును 1938లో కొమరవోలు ఆహ్వానించారు సాధుజీ.

ఏడేండ్లు పొట్టి శ్రీరాములు సాధుజీతో గడిపారు.

1942 బళ్లారి జైల్లో కూడా శ్రీరాములు సాధుజీ కలసి సేవాకార్యక్రమాలు నిర్వహించారు. గాంధీ స్మారకనిధి ఆంధ్ర సంచాలకునిగా శ్రీరాములు నియామకానికి సాధుజీ కారకులు.

1952 అక్టోబరులో శ్రీరాములు నిరశనవ్రతం లో ప్రకృతి వైద్యులు క్రిష్ణంరాజు తో పాటు సాధుజీ పరిచర్యలు చేశారు.

శ్రీరాములు భౌతిక కాయం ఊరేగింపులో కూడా సాధుజీ రథం పై కూర్చొన్నారు.

# 10 క్విట్ ఇండియా ఉద్యమం

ఆంగ్లేయుల ప్రభుత్వంపై గాంధీజీ ప్రయోగించిన చివరి అస్త్రం క్విట్ ఇండియా ఉద్యమం. 1942 ఆగష్టు 8న బొంబాయి కాంగ్రెసు మహాసభలో ప్రజలకు విజయమో! వీర స్వర్గమో, అని నినాదం యిచ్చారు. దేశ నాయకులందరు మరునాడే జైళ్లపాలయినారు. నాయకులు ఎవ్వరూ లేనందున ప్రజలే ఉద్యమం తమ హస్తగతం చేసుకున్నారు.

ఆంధ్ర దేశంలో క్విట్ ఇండియా ఉద్యమం ఉవ్వెత్తున లేచింది. గాంధీజీ ఇతర నాయకుల అరెస్టుకు నిరసనగా గుడివాడలో త్రివర్ణపతాకాన్ని చేతబూని ప్రభుత్వ వ్యతిరేక నినాదాలు చేస్తున్న పొట్టి శ్రీరాములును 1943 ఫిబ్రవరిలో అరెస్టుచేసి ఆరు నెలల శిక్ష విధించి బళ్లారి జైలుకు పంపారు.

బళ్లారి సమీపాన అలీపూరు క్యాంపు జైలులోని 18 బ్లాకులు ఉద్యమ కారులతో నిండిపోయాయి. శ్రీరాములు గారిని నిర్బంధించిన బ్లాకులోనే నాస్తికవాద ప్రచారకుడు గోపరాజు రామచంద్రరావు, హిందీ ప్రచారకుడు యలమంచిలి వెంకటప్పయ్య, యువ కర్షక నేత దరువూరి వీరయ్యగార్లుండే వారు. శ్రీరాములు జైలులో అందరికంటే ముందుగా నిద్రలేచి పారిశుధ్య కార్యక్రమాలతో తన పనులు మొదలు పెట్టేవారు. శ్రీరాములు గారి కార్యకలాపాలు సహచర ఖైదీలనే గాక జైలు అధికారులను ముగ్ధులను గావించేవి.

* * *

# 11. ఇంకా అంటరాని తనమేనా! ఇకపై సాగదు.

అంటరాని వాళ్లెవరండీ
మన వెంటరానివాళ్లే
–మాధవపెద్ది బుచ్చి సందరరామశాస్త్రి

క్విట్ ఇండియా ఉద్యమంలో జైలునుండి విడుదలయిన శ్రీరాములు స్వస్థలం నెల్లూరు చేరాడు. పవిత్ర పినాకినీ తీరాన సూత్ర యజ్ఞం ప్రారంభించాడు. కుల భేదాలు పోగొట్టాలనే వ్రతం చేపట్టాడు. అన్ని కులాల వారితో సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేస్తూవుండేవాడు. అంటరాని తనం నిర్మూలనా ప్రచారానికి ఆయన ఒక వినూత్న పద్ధతిని నడిచేవాడు. ముందు వైపు మెడలో ఒక అట్ట వెనుక వైపు వీపున మరొక అట్ట తలిగించుకొనేవాడు. 'అంటరానితనం మహాపాపం' అని ఒకదాని పైనా, 'దేవుని దృష్టిలో మానవులంతా సమానులే! హరిజనులను దేవాలయాలలోనికి రానివ్వండి'. అని మరొక అట్టపైనా నినాదాలు వ్రాసి వుండేవి.

1945 లో కొందరు యువకులు నెల్లూరులో హిందూ సంఘ సంస్కరణ సమితి స్థాపించారు. హరిజనోద్ధరణ, వితంతు వివాహాలు, సహ పంక్తి భోజనాలు, అనాథప్రేత సంస్కారాలు - ఈ సమితి కార్యకలాపాలు. పొట్టి శ్రీరాములు ఈ సమితి సహాయకార్యదర్శిగా పనిచేసేవాడు. నిరాడంబరంగా తన కర్తవ్యాన్ని చేసికొని పోవటమే గానీ ప్రచారం కోసం ఏనాడు తపన పడేవాడు కాదు.

నెల్లూరులోని ఆర్య సమాజంలో కూడా శ్రీరాములు చురుకైన కార్యకర్త మాత్రమే. నెల్లూరులోని ప్రసిద్ధ దేవాలయములలో శ్రీ వేణుగోపాల స్వామి దేవస్థానం ఒకటి. దానిలో హరిజనుల ప్రవేశం జరిపించాలని శ్రీరాములుగారి పట్టుదల. నాటి ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డి చాల పలుకుబడి గల వ్యక్తి.

ముందుగా హరిజన కార్యకర్తలు దేవస్థానం వారికి తమ కార్యక్రమం గురించి తెలుపుతూ నోటీసు పంపారు. కాని ఎలాంటి ప్రతి స్పందన కలుగలేదు.

1946 ఫిబ్రవరి 25న నెల్లూరులో ఆచార్య పి.సి. రెడ్డి అధ్యక్షతన బహిరంగ సభ జరిపి ధర్మకర్తల ధోరణికి నిరసన తెలిపారు. పొట్టి శ్రీరాములు ఈ విషయమై నిరాహార దీక్ష పూనడానికి సంసిద్ధత వ్యక్తం చేశాడు. గాంధీజీ ఆశీస్సులను కోరాడు.

1946 మార్చి 7న నెల్లూరు వేణుగోపాల స్వామి కోనేటి గట్టున శ్రీరాములు తన నిరాహార దీక్ష ప్రారంభించాడు. వారం రోజులలో నెల్లూరు పట్టణంలో ఉద్రిక్తత వ్యాపించింది. దేవస్థానం అధికారులు దిగివచ్చారు. మార్చి 15న హరిజనులు ఆలయంలో ప్రవేశించవచ్చునని ప్రకటించారు. శ్రీరాములు గారు 15 తేది రాత్రి 12 గంటలకు నిరాహార దీక్ష విరమించారు.

బొంబాయి నుండి గాంధీజీ ఏప్రిల్ 15న విడుదల చేసిన ప్రకటనలో ఇలా అన్నారు. "శ్రీరాములు గొప్ప కాంగ్రెస్ వాది. ఆయన పేదవాడు. ఆయన ఉద్యమాన్ని బలపరచవలసిందిగా కోరుతున్నాము".

గాంధీజీ జోక్యంతో శ్రీరాములు గారి కీర్తి దేశమంతటా వ్యాపించింది. మద్రాసు నుండి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఒక ప్రత్యేక ప్రతినిధిని పంపింది.

వినయాశ్రమవాసి గొల్లపూడి సీతారామశాస్త్రి నెల్లూరు వచ్చి శ్రీరాములును అభినందించారు.

హరిజన దేవాలయ ప్రవేశం చట్టంగా రావాలని శ్రీరాములుగారు 1946 నవంబరు 25న తిరిగి 19 రోజుల పాటు నిరాహార దీక్ష పూనాడు. అప్పుడు మద్రాసులో ప్రధానిగా ఆంధ్ర కేసరి ప్రకాశం వున్నాడు. ఈ విషయమై ఆయన గాంధీజీకి రెండు లేఖలు వ్రాశాడు. వాటికి బాపూజీ క్రింది విధముగా సమాధానమిచ్చాడు.

క్యాంపు. చందాపూర్
4-1-1947

ప్రియమైన ప్రకాశం,

డిశంబరు 10, 11 తేదీలలో మీరు వ్రాసిన లేఖలు ఢిల్లీ నుండి యిచ్చిన టెలిగ్రాం చేరాయి. మీరు వివరించిన రీతిని శ్రీరాములు నిరాహార దీక్ష జయప్రదంగా ముగిసినందుకు నాకు చాలా ఆనందం కలిగింది. ఆయన తన దీక్ష ముగిసిన వెంటనే నాకు ఒక టెలిగ్రాం పంపాడు. కొంత ఉద్వేగి అయినా అతడు దృఢమైన కార్యకర్త అని నేనెరుగుదును.

-గాంధీ

తాను వడికిన నూలుతోనే తన బట్టలు ధరించేవాడు. గూడ కట్టు అరచేతుల చొక్కా, తుండు గుడ్డా, ఒక సంచిలో తకిలీ, ఏకుల కట్ట, గుడ్డల సబ్బు - ఇవే శ్రీరాములుగారి యావదాస్తి. కాళ్లకు చెప్పులు కానీ తలకు ఆచ్ఛాదన కాని లేకుండా ఎర్రటి ఎండలో కూడా పాదయాత్ర చేసే శ్రీరాములు అవధూత మాదిరి జీవితం గడిపాడు.

# 12. గాంధీ కుటుంబీకుడు

1948 జనవరి 30న 'జాతిపిత' అయిన మహాత్మాగాంధీ అవతారం చాలించారు. ఆయనకు ప్రీతిపాత్రమైన హరిజనోద్ధరణ తగిన రీతిలో కొనసాగడం లేదని శ్రీరాములు గారు భావించసాగాడు.



బాపూజీ వర్ధంతి (జనవరి 30) ప్రతి ఏటా హరిజన దినోత్సవంగా జరుపబడాలని ఆయన కోరిక. తన కోరికను తెలుపుతూ నాటి మద్రాసు ప్రధాని శ్రీ ఒమండూరు రామస్వామి రెడ్డియార్ గారికి శ్రీరాములు ఒక లేఖ వ్రాశాడు. లేఖతో ఎలాటి ఫలితం కనుపించనందున శ్రీరాములు నేరుగా మద్రాసు వెళ్లి ముఖ్యమంత్రి నివాసం ముందే నిరాహార దీక్షకు పూనుకొన్నాడు. అధికారులకు అది ఒక అసహ్యాకర కార్యంగా తోచింది. ఆయనపై 'న్యూసెన్సు' కేసు పెట్టారు. అరెస్టు చేసి నెల రోజులు జైలులో నిర్బంధించారు. స్వతంత్ర భారతంలో శాంతి కాముకుడైన గాంధేయ వాదికి జరిగిన సన్మానమది.

జైలు నుండి విడుదలయిన శ్రీరాములు నేరుగా వార్ధా వెళ్లాడు. అక్కడ ఆచార్య వినోబా పరామరికలో శ్రీరాములు తిరిగి నిరాహార దీక్షకు పూనుకొన్నాడు. 28 రోజులు ఆ దీక్ష సాగింది. ఆనాడు 'రాష్ట్రపతి' గా వున్న బాబూరాజేంద్ర ప్రసాదు ఆ సమయంలో వార్ధా రావడం తటస్థించింది. శ్రీరాములు నిరాహార దీక్ష గూర్చి మద్రాసు ప్రధాని శ్రీ ఒమండూర్ రామస్వామి రెడ్డికి సుదీర్ఘమయిన లేఖ వ్రాశారు. ఫలితంగా మద్రాసు ప్రభుత్వం జనవరి 30న హరిజన దినోత్సవంగా ప్రకటిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. హరిజనులతో సహపంక్తి భోజనాలు మంత్రుల విధిగా ఆదేశించబడినది. హరిజనులకు బంజరు భూములు పంపకం ప్రారంభ మయింది. హరిజన విద్యార్థుల కొరకు హాస్టళ్లు నెలకొల్పబడినాయి. విద్యా సంస్థలలో ఉద్యోగాలలో హరిజనులకు చక్కని అవకాశాలు కల్పించ బడినాయి. శ్రీరాములు గారి దీక్షా విజాయాన్ని గూర్చి సేవా గ్రాములోని ఆచార్య వినోబాభావే ఇలా అన్నారు. "మా ఆశ్రమ వాసుల మనస్సులలో మాలిన్యాన్ని కడిగివేసి మాలో చైతన్యం కలిగించడం కోసం మా కుటుంబీకుడగు శ్రీరాములు గారే సత్యాగ్రహం చేయవలసి వచ్చింది".

* **

# 13. మోటూరు వారు మెచ్చిన మనీషి

చిరకాలం చెన్నయ్ (మద్రాసు) కేంద్రంగా దక్షిణ భారత హిందీ ప్రచార సభ నిర్వాహకులు మోటూరి సత్యనారాయణగారు ప్రముఖ గాంధేయవాది. బాపూజీకి అత్యంత సన్నిహితులు. కొంతకాలం పార్లమెంటు సభ్యులుగా వున్నారు. కొమరవోలు ఆశ్రమ వ్యవస్థాపకులు సాధు సుబ్రహ్మణ్యం గారికి బాల్య మిత్రులు.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలలో తన సహచరుడయిన పొట్టి శ్రీరాములు గారి నిజాయితీ, సామర్థ్యం, అంకితభావం, మోటూరి వారికి చక్కగా తెలుసు. ఒకసారి జరిగిన సంఘటనతో పొట్టి శ్రీరాములు స్థాయి మోటూరి వారి దృష్టిలో నూరు అడుగుల పైకి ఎదిగి పోయింది. అది ఏమంటే....

1946 జనవరి 18న మహాత్మాగాంధీ సాయంకాలం ప్రార్థన స్థలానికి వెడుతున్నారు. శ్రీరాములు తన పద్ధతిలో ముందు వెనుక అట్టలు కట్టుకొని వీరి కంటె ముందుగా నడుస్తున్నారు. గాంధీజీ త్రోవకు ఆయన అడ్డు వస్తున్నాడని శ్రీ మోటూరి భావించారు. వెంటనే ఆయన శ్రీరాములుగారి దగ్గరకు వెళ్లి రెండవ వరసలో నడవవలసిందిగా కోరారు. ఇది గమనించిన బాపూజీ మోటూరి వారిని మందలిస్తూ "ఆయనను అడ్డు పెట్టవద్దు శ్రీరాములు గూర్చి నీకు తెలియదు. ఆయన ఒక నిఖార్సయిన కార్యకర్త" అన్నారు.

మోటూరి వారికి అప్పుడు అనిపించింది. ఔరా!! ఒక మహాత్ముణ్ని గుర్తించటం మరొక మహాత్మునికే సాధ్యమౌతుందని.

# 14. గాంధీ స్మారక నిధి సంచాలకత్వం

మహాత్ముని నిర్యాణం పిమ్మట జాతీయ నాయకులు ఢిల్లీ కేంద్రంగా గాంధీ స్మారక నిధి ఏర్పరచారు. వివిధ రాష్ట్రాలకు 16 మంది గాంధేయ వాదులను సంచాలకులుగా నియమించారు. ఆంధ్రదేశానికి పొట్టి శ్రీరాములు గాంధి స్మారక నిధి సంచాలకులుగా నియమితులయినాడు. ప్రధాన స్కీముకు లోబడి ఏయే ప్రాంతాలకు తగినట్లు ఆయా ప్రాంతాలలో స్కీములు ఏర్పాటుకు సంచాలకులకు విచక్షణాధికారాలు యివ్వబడినాయి. శ్రీరాములు తన నియామకం జరిగిన వెంటనే రాష్ట్రం అంతటా విస్తృతంగా పర్యటించి వివిధ సేవా సంఘాలను గుర్తించాడు. ప్రముఖ సంఘ సేవకులతో చర్చలు జరిపాడు. ఈ సందర్భంలోనే ఒకసారి గుంటూరు జిల్లా గురజాల వచ్చాడు. ప్రముఖ స్వతంత్ర్య సమరయోధుడు పల్నాటి విద్యాదాత శ్రీ కావూరి వెంకయ్యను కలుసుకున్నాడు. సుప్రసిద్ధ చారిత్రక ప్రదేశమైన నాగార్జున కొండ చూడాలని కోరిక వ్యక్తం చేశాడు. తాను నిర్వహిస్తున్న ట్రెయినింగ్ స్కూల్‌లో విద్యార్థిగా నున్న శ్రీ జె.భావాసంగ్ నుతోడు నిచ్చి శ్రీరాములుకు నాగార్జున కొండ పరిసర ప్రదేశాలు చూపించమన్నాడు శ్రీ వెంకయ్య.

స్వచ్ఛంద సంఘాలకు నిధులు మంజూరు చేయడంలో శ్రీరాములు మిక్కిలి జాగరూకత వహించేవాడు. నిధులు సక్రమంగా వినియోగ మయ్యేటట్లు చూచేవాడు.

గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా సంఘ సేవకులకు రెండు సంవత్సరాల కోర్సును ఈ విధంగా ప్రతి పాదించాడు. శ్రీరాములు

1. ఆరు నెలల పాటు శ్రీ ఏజెళ్ల శ్రీరాములుగారి పర్యవేక్షణలో తెనాలి గాంధీ విద్యాలయంలో ఆరోగయం పశుగణాభివృద్ధిలో శిక్షణ.

2. తొమ్మిది నెలలు శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం ఆధ్వర్యాన కోమరోలు గాంధీ ఆశ్రమంలో గ్రామీణ సేవలో శిక్షణ.

3. ఎంపిక కాబడిన కొద్ది మందికి మూడు నెలల ప్రత్యేక శిక్షణ.

శిక్షణలో వున్నవారికి పొగత్రాగడం, మాంసాహారం నిషిద్ధం. ఖద్దరు తప్పక ధరించాల్సి వుంటుంది. తోడి శిక్షణ పొందే వారితో స్నేహ భావం పెంపొందించుకోవాలి. శ్రీరాములుగారు ఎంత శ్రమించినా తాను అనుకున్న రీతిని కార్యక్రమాలు ముందుకు సాగనందున మిక్కిలి బాధపడేవాడు.

భూదాన యజ్ఞం ట్రస్టు, గాంధీ ట్రస్టు, కస్తూరిబా ట్రస్టులు ఇతర రాష్ట్రాలలో ముందంజవేయగా ఆంధ్రదేశంలో తగినంతగా పురోగతి లేక పోవడం ఆయనకు మిక్కిలి బాధ కలిగించింది.

శ్రీరాములు గారి అవసరాలు చాల స్వల్పం. ఒక్క పూట మాత్రమే భోజనం చేసేవారు. ఒక్క లుంగీ, ఒక్క చొక్కా, ఒక తుండు మాత్రమే వాడుకునేవాడు. రైలు ప్రయాణాలు సరేసరి 3వ తరగతిలోనే.

గాంధీ స్మారక సంచాలకునిగా ఆయన నెల జీతం రూ.150/ కాగా శ్రీరాములు నిజాయితీని తెలిపే ఒక ఉదాహరణ. నెల్లూరు జిల్లాలో ఒక గ్రామంలో జిల్లా గ్రామీణ సంఘ సంక్షేమ సమావేశానికి శ్రీరాములు వెళ్లాడు.

అనధికార సభ్యుడుగా ఆయనకు రూ.16.8.0 బత్తా మంజూరయింది. కానీ ఆయన ఖర్చు పెట్టిన రెండు రూపాయలు (బస్సు ఛార్జీలు రూ. 1,8.0 & 0.8.0 టిఫిను) మాత్రమే తీసికున్నాడు. ఆంధ్రదేశంలో గాందీస్మారక నిధి మెదలగు సంస్థలు అభివృద్ధి సాధించక పోవడానికి ఉమ్మడి ప్రభుత్వమే కారణమని శ్రీరాములు గట్టిగా విశ్వసించాడు. ఆంధ్రులకు తమకంటూ ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే గాని అధికార అనధికారుల మధ్య సమన్వయం ఏర్పడి అభివృద్ధి సాధ్యంకాదని శ్రీరాములు నిర్ణయానికి వచ్చాడు. నాయకులలో అనైక్యత వ్యక్తి ప్రతిష్ఠలు రాష్ట్ర నిర్మాణానికి అడ్డం కులవుతున్నాయని ఆయన గర్తించాడు.

ఆమరణ నిరాహార దీక్ష ఒక్కటే మార్గమని తీర్మానించుకున్న శ్రీరాములు 1952 అక్టోబరు 16న గాంధీ స్మారక నిధి బాధ్యతలను ఎస్.హెచ్. యాజీ గారికి అప్పగించి మద్రాసు పయనమయినాడు.

***

# 15. చెన్నపట్నం చిక్కుముడి

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో తమిళ, ఆంధ్ర, కన్నడ, కేరళ ప్రాంతాలు చేరివున్నాయి. ఆంధ్రదేశంలో కృష్ణా, గోదావరి, పెన్నా డెల్టాల వల్ల కోస్తా ప్రాంతం వ్యవసాయరంగంలో అభివృద్ధి సాధించింది. రాష్ట్ర ఆదాయంలో అధిక భాగం తెలుగు జిల్లాల నుండి వచ్చినప్పటికీ సరియైన దామాషాలో ఆంధ్ర ప్రాంతానికి వినియోగం జరుగలేదు.

రాజధాని నగరమైన మద్రాసుకు దక్షిణంగా రైలు మార్గం ముందుగా ఏర్పడటంతో దక్షిణ ప్రాంతానికి చెందిన తమిళ కుటుంబాలు నగరంలో స్థిరపడి ప్రభుత్వ ఉద్యోగాలలో కీలక స్థానం ఆక్రమించాయి. ఎంతో ఆందోళన చేస్తేగాని ఆంధ్ర యూనివర్సిటీ (1926 లో) ఏర్పడలేదు. 1857 లో ఏర్పడిన మద్రాసు యూనివర్సిటీ వల్ల ఆంధ్రులకు ఎక్కువగా ప్రయోజనం చేకూరలేదు.

మద్రాసు నగరానికి మొదటి పేరు చెన్నపట్టణం. చెన్నప్ప అనే స్థానిక తెలుగు రాజకుటుంబీకుని పేరిట ఇది ఏర్పడింది. క్రీస్తు శకం 1639లో చంద్రగిరి రాజధానిగా పాలించిన విజయనగర ప్రభువు శ్రీ రంగరాయల నుండి ఫ్రాన్సిస్‌డే అనే కంపెనీ ఉద్యోగి దానం పొందాడు. చారిత్రకంగా తెలుగు నగరమయిన మద్రాసు తెలుగు, తమిళ ప్రజల సమష్టికృషితోనే మహానగరమయింది.

1926 లో కేంద్ర శాసన సభలో తమిళనాడు ప్రత్యేక రాష్ట్రం కావాలంటూ శంకరనాయర్ అనే సభ్యుడు కోరాడు. దానిలో మద్రాసును

ఆయన చేర్చలేదు. కారణం ఆంధ్రులకు - తమిళులకు దానిపై సమాన హక్కులుండటమే! రాజాజీ మద్రాసు తమిళనాడులో అంతర్భాగమని వాదిస్తూ వచ్చారు. మద్రాసులో వసూలయిన కాంగ్రెసు పార్టీ ని [illegible] క (తమిళులకు) కావాలన్నాడు. ఆంధ్ర నాయకులు తీవ్రంగా వ్యతిరేకించారు. ఫలితంగా ఆంధ్ర, తమిళ సంఘాలకు చెరి సమంగా ఆ నిధులు పంచబడినాయి. శాసన సభకు గాని మద్రాసు కార్పొరేషన్‌కు గాని ఆంధ్ర తమిళ కాంగ్రెసు సంఘాలు చెరిసమంగా సీట్లు కేటాయిస్తూ వచ్చాయి. 1947 లో ఏర్పాటైన ధార్ కమీషన్ మద్రాసు నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలని చెప్పింది. ఇన్ని దాఖలాలు చూపినా మద్రాసు తమిళ నాడులో అంతార్భగమనే వాదన బలపడుతూ వచ్చింది. మద్రాసులో పుట్టి పెరిగి నగరంలో ఎన్నో సంవత్సరాల అనుబంధం కలిగిన పొట్టి శ్రీరాములకు ఇది బాధాకరంగా తయారయింది.

***

# 16. ప్రాయోపవేశపూర్వరంగం

గాంధేయవాదైన పొట్టి శ్రీరాములు. ఆంధ్ర నాయకులయిన ఆంధ్ర కేసరి ప్రకాశం, ఆచార్యరంగా గార్లకు రాష్ట్ర నిర్మాణం కోసం తామే ప్రాయోపవేశం చేయాల్సిందిగా కోరాడు. వారి నుండి సమాధానం రాలేదు.

1952 సెప్టెంబరు 15న నెల్లూరి నుండి మద్రాసులో న్యాయవాదిగా వున్న శ్రీ భాగవతుల లక్ష్మీ నారాయణగారికి ఇలా లేఖ వ్రాశాడు. "ఆంధ్ర రాష్ట్రం గూర్చి నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను. మన పెద్దలంతా ఒక నిర్ణయానికి వస్తారని ఆశించాను. నేను ఏదేని పార్టీకి సాధనంగా వుండడం నా తత్త్వానికి వ్యతిరేకం. నాకు ఏ పార్టీ లేదు. నాకు ఎవరూ అనుచరులు లేరు. నేనే పనిచేసినా ఒంటరి పోరాటమే! నేను అనేక నిరశన వ్రతాలు చేశాను. ఆంధ్ర రాష్ట్ర సమస్య భిన్న అభిప్రాయాలకు తావిచ్చింది. ఎవరికి తోచినట్లు వారు ఆలోచిస్తున్నారు. ప్రజలు ధర్మబద్ధంగా ఆలోచిస్తేగానీ ఏకగ్రీవ నిర్ణయానికి రాలేరు. పదవిలో వున్న వారి మనసు మార్చటం అంత సులువు కాదు. ఏ కోరిక, రాగ, ద్వేషం లేకుండా నిశ్చయంగా నా జీవితాన్ని త్యాగం చేయడమే ఏకైక మార్గంగా కన్పిస్తుంది. నిన్నటి నుండి ఈ మాదిరి తలపోస్తున్నాను. ఇంకా ఆలస్యం చేస్తే పాపానికి ఒడిగట్టిన వాడినవుతాను. ఈ అసిధారా వ్రతం నెరవేరుస్తాను. నా జీవితం దానికోసం త్యాగం చేస్తాను."

శ్రీరాములు తన లేఖతో పాటు ఒక మానిఫెస్టోను కూడా జత చేసాడు. "స్వామి సీతారాం మద్రాసు సమస్యను మధ్యవర్తి తీర్పుకు వదలి వేయాలంటారు. నగరంలోని నాయకులు మద్రాసులేని ఆంధ్రరాష్ట్రం అక్కరలేదంటారు. ఆంధ్రరాష్ట్రం మద్రాసు సమస్యతో ముడిపడివుంది.

ఆంధ్ర రాష్ట్ర సాధనకు ఇతర మార్గాలున్నా మహాత్ముని నిష్కామ సేవా బోధనల ఔన్నత్యం నేటికి నిలిచే వున్నాయి.

ఈనాడు సుబ్రహ్మణ్య భారతి ఉత్సవాలలో పాల్గొన్న మద్రాసు మంత్రి సి. సుబ్రహ్మణ్యం మద్రాసు తమదే (తమిళులు) నన్నారు. మద్రాసు ముఖ్యమంత్రి రాజాజీ కూడా కొద్ది దినాల క్రితం అలాగే చెప్పాడు. కేంద్ర రాష్ట్ర మంత్రు లెవ్వరికీ దీనిని ఖండించే ధైర్యం లేదు. ఆదర్శవంతమైన పరిష్కారం మద్రాసు కేంద్ర పాలిత ప్రాంతం చేయడమే! అధికారములో వున్న వారికి ఇష్టము లేదు. కాబట్టి ఒక అంగీకారం జరగాలి

1. పండిట్ నెహ్రూ నిర్ణయించవచ్చు.
2. రాజాజీ (తన ధోరణిని మార్చుకోవాలి)
3. మద్రాసు ప్రజలే కోరాలి
4. ఆంధ్రులంతా ఐక్యమై కోరాలి.

ఇవన్నీ సాధ్యపడేటట్లు లేదు. కనుక నేను ఆమరణాంత నిరాహార దీక్ష నిర్ణయం తీసికొన్నాను." పై విషయాలన్ని శ్రీరాములు తన మానిఫెస్టోలో చేర్చాడు.

***

# 17 హోమగుండం

పొట్టి శ్రీరాములు తన ఆమరణ నిరహార దీక్షకు వేదికగా మద్రాసు నగరాన్నే ఎంచుకున్నాడు. మద్రాసును గూర్చి తుది విన్నపంలో ఇలా తెలిపాడు.

“మద్రాసు నగర భవిష్యత్తును గూర్చి తీవ్ర ప్రయత్నం అవసరమై వున్నది. నిష్పాక్షిక ఆలోచనలు గల ఆంధ్రులు - తమిళులు ఒక చోట చేరి నగర పౌరులు మరియు నగరంతో సంబంధం కలవారికి భద్రత కలిగే రీతిలో ప్రజలను తృప్తి పరచే అంగీకారానికి రావలసి వుంది.

ఆంధ్ర రాష్ట్రం విషయమై మద్రాసు గూర్చిన సంఘటనలు వివరిస్తూ తుది పలుకుగా మద్రాసు నగరాన్ని గూర్చి ఒక ఒడంబడిక రావలెనని దాని వలన ప్రజల అభీష్టం నెరవేరి మద్రాసు రాజధానిగా నూతన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడాలని నేను కోరుతూ నా హృదయాంతరాళం నుండి ఆంధ్రులకు, తమిళులకు, ఇతరులకు విజ్ఞప్తి చేస్తున్నాను”.

శ్రీరాములు గారు తాను జన్మించిన వీధిలోనే నిరాహార దీక్ష పూనవలెనను కొనినాడు. కాని అక్కడి వారు అందుకు అంగీకరించలేదు. తరువాత బులుసు సాంబమూర్తి గారిని దర్శించి తమ కోరిక తెలిపాడు. సాంబమూర్తి మద్రాసు రామానుజకూటంలో గానీ, శుభోదయం కాంపౌండులలో గాని వీలగునేమోనని ప్రయత్నించమనినాడు. కాని అవి సఫలం కాలేదు.

చివరకు మైలాపూర్ నందలి మహర్షి బులుసు సాంబమూర్తి గారి వసతి గృహంలో తన బలిదానం జరగాలని నిర్ణయించుకున్నాడు. ఆ యింటి యజమాని తమిళుడైనా ఏలాంటి అడ్డంకులు కల్గించలేదు.




1952 అక్టోబరు 19 తేది ఉదయం 10 గంటలకు దీక్ష ఆరంభమైనది. 58 దినములు సాగిన మహా తపస్సులో ఎన్నో సంఘటనలు జరిగాయి. తొలుత గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు ఆంధ్రమహాసభ అధ్యక్షుని హోదాలో శ్రీరాములు గారిని దీక్ష విరమించాలని కోరారు. కానీ ఆయనకు ఒక్క నమస్కారము పెట్టి శ్రీరాములు మౌనం వహించాడు. నవంబరు 8న కుటుంబ స్నేహితుడైన ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య దీక్ష విరమించమని చేసిన విజ్ఞప్తికి శ్రీరాములు ఇలా సమాధానం యిచ్చాడు.

"మీకు, మీ కుమార్తె అన్నపూర్ణమ్మ గారికి నా పట్ల గల వాత్సల్యంతో నా ధ్యేయాన్ని మరచినట్లున్నారు". "ఉపవాసం శ్వాతి ఖించుతుంటే తెన్నేటి విశ్వనాథం, సామి వెంకటాచలం శెట్టి ప్రభృతులు శ్రీరాములు గారిని సమీపించి ఇప్పటికిప్పుడు ఏమి చేస్తే మీరు ఉపవాసం విరమిస్తారు' అని అడిగారు. మద్రాసులో రాజధానికి అన్ని పార్టీలు కలపి నడుం కడితే ఉపవాసం విరమిస్తానన్నాడాయన.

డిసెంబరు 7 నాటికి శ్రీరాములు దీక్ష 50వ రోజుకు చేరుకున్నది. మద్రాసులో ఆంధ్రకేసరి ప్రకాశం గారి అధ్యక్షతన అఖిల పక్ష సమావేశం జరిగింది. కాంగ్రెసు వారెవ్వరు ఇందులో పాల్గొనలేదు. పాల్గొన్న కృషీ కార్ లోక్ పార్టీ వారు ఆంధ్ర రాష్ట్ర రాజధాని తిరుపతి కేంద్రంగా వుండా లన్నారు. శ్రీరాములు ఆశయానికి అనుగుణంగా మద్రాసు కేంద్రంగా ఆంధ్రరాష్ట్రం నిర్మాణం జరగాలని తీర్మానం ఆమోదింపబడినట్లు ప్రకాశం గారు ప్రకటించారు. దానిని వ్యతిరేకిస్తూ కమ్యూనిష్టులు మద్రాసు వీధులలో ఊరేగింపు జరిపారు.

ఈ తీర్మానాన్ని దృష్టిలో వుంచుకొని ప్రధాని నెహ్రూ పార్లమెంటులో డిసెంబరు 9న ఆంధ్రుల మద్రాసుపై హక్కులు వదలుకుంటే ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పాటు చేయబడగలదని ప్రకటించారు.

ఆయనను పరీక్షిస్తున్న డాక్టరు కస్తూరి నారాయణమూర్తి దీక్షా విరమణ కోరగా శ్రీరాములు ముక్కుపై వేలు వుంచుకొని త్రోసిపుచ్చాడు. తాను స్పృహ కోల్పోయినప్పుడు ఎలాంటి ఇంజెక్షన్లు కాని ఏ రకమైన ఆహారం కానీ యివ్వరాదని ఆయన డాక్టర్లను కోరారు.

ఆంధ్రకేసరి ప్రకాశం సైతం ఈ విషయమై ఆయనను సమీపించగా "ఈ ప్రపంచంలో ధర్మానికి స్థానమున్నదా" అన్న ప్రశ్నకు లేదని ప్రకాశం గారనగా "అయితే ఇంకా నేను బ్రతికి ఏమి ప్రయోజనం - నేను మరణించడమే మేలు" అన్నాడు శ్రీరాములు.

శ్రీరాములు గారి నిరాహార దీక్ష ఇలా సాగింది. "ప్రతి దినం నాలుగు నిమ్మకాయల రసము రెండు స్పూనులు తేనె - నాల్గు దఫాలుగా - మాత్రమే తీసికొనే వారు. 45వ రోజునుండి వీటిని కూడా తీసికొనలేక పోయేవారు.

కొద్దిగా టెంకాయనీళ్లు త్రాగుడని సాంబమూర్తి సూచించినా దీక్షా పవిత్రతకు భంగం కాగలదని చెప్పాడు.

వారి దీక్షా కాలంలో డాక్టర్లుగా కస్తూరి నారాయణమూర్తి, కర్నల్ టి. ఎస్. శాస్త్రి ఎస్. ఎల్. కాంతారావు, ఎ.వి. అవధాని ప్రకృతి వైద్యులు వి. కృష్ణంరాజు, శ్రీరాములు గారిని పరీక్షించేవారు.

డాక్టరు కస్తూరి నారాయణమూర్తి వీరి బలిదానం గూర్చి సమగ్ర నివేదిక తయారు చేసారు. అందులో ఆయన ఇలా వ్రాశారు.

"ఐర్లండ్ దేశానికి చెందిన మాస్వినీ, పంజాబ్‌కు చెందిన జతీన్‌దాసు ఇంతకంటే ఎక్కువ కాలంలో దీక్షలో వుండి దేహ త్యాగం చేశారు. కానీ వీరి విషయంలో ఎలాంటి శాస్త్రీయ నిర్ధారణలు జరిగి యుండలేదు. జతీన్ దాసుకు బలవంతంగా ఇంజెక్షన్లు ద్వారా ఆహారం ఎక్కించే ప్రయత్నం చేశారు. శాస్త్రవేత్తలు ప్రాణి జననం గూర్చిన మూలశక్తి పరిశోధించారే గానీ ప్రాణం ఆరోగ్య వంతులనుండి నిర్గమించే పరిశోధన జరుపబడలేదు. ప్రాణి - కేవలం శరీరమే కాదు. ఆత్మ కూడా.

"1953 సంవత్సరాల క్రిందట ఏసుక్రీస్తు 'క్రాసు' పై బలిదానం కావడం జరిగింది. అదే మాదిరి మన కండ్లముందే రాష్ట్రం కోసం శ్రీరాములు ఆత్మార్పణ గావించారు" అంటూ ప్రకటించారు డాక్టరు కస్తూరి నారాయణమూర్తి. ఇంతటి బలిదానం జరుగుచున్నా ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లు ఏమీ పట్టించుకోలేదు. పైగా రాష్ట్ర ప్రభుత్వం నుండి కేంద్రానికి పంపిన నివేదికల్లో శ్రీరాములుగారి దీక్ష యాదార్థమైనది కాదని వ్రాయడం మిక్కిలి దారుణం.

# 18. మహా ప్రస్థానం



1952 డిశెంబరు 15 రాత్రి 11.20 గంటలకు శ్రీరాములు గారి ప్రాణం అనంత వాయువుల్లో కలిసిపోయింది. తెల్లవారేసరికి శోకతప్తులయిన జనం తీర్థం ప్రజలాగా ఆయన భౌతిక కాయాన్ని దర్శించడానికి తరలివచ్చారు.

మర్నాడు శ్రీరాములు గారి భౌతిక కాయాన్ని పూలరథంపై పద్మాసనంలో కూర్చొండ బెట్టారు. ఒక వైపు మహర్షి బులుసు సాంబమూర్తి రథం పై ఆసీనులయినాడు. మద్రాసు సెంట్రల్ స్టేషన్ వచ్చే సరికి ఆంధ్రకేసరి ప్రకాశం ఊరేగింపుతో చేరి భౌతిక కాయానికి రెండోవైపు ఆసీనుడైనాడు.

రెండు మైళ్లు సాగిన ఊరేగింపులో ఒక్క అవాంఛనీయ సంఘటన జరగలేదు. అది శ్రీరాములు గారి ఆత్మ శక్తి ప్రభావమే!

దహన సంస్కారం పిమ్మట జరిగిన సభలో ఆంధ్రకేసరి ప్రకాశం ఉద్వేగంతో ఇలా ప్రసంగించారు. "శ్రీరాములును మనము దక్కించుకోలేక పోయాం. అతడు చాలా గొప్పవాడు. గాంధీ అస్తమించిన తర్వాత సత్యం అహింసలు నవ్వుల పాలయినందుకు అతడు విచారించాడు. ఉత్తమములని తాను నమ్మిన సత్యం, - అహింసలకు తిరిగి ప్రాణ ప్రతిష్ఠ చేయదలిచాడు. నేను ఉపవాసాలలో నమ్మకం లేని వాణ్ణి. కాని శ్రీరాములు ఉపవాసం వల్ల ఏమి సాధించవచ్చునో తన ప్రాణాలనే అర్పించి చూపినాడు. శ్రీరాములు చనిపోయినాడని మనలో కొందరు విచారించుచున్నారు. కాని అతడు చావలేదు. అతడు అమరజీవి. మన అందరిలో అతడు ప్రవేశించాడు. దేవుడు సర్వత్రా వ్యాపించి యున్నట్లుగా మనలో వ్యాపించి పోయినాడు. మనలో మనం క్రింద మీద అవుతూ దెబ్బలాడు కొంటూ వుండగా ఆంధ్రరాష్ట్రానికి తన ప్రాణాన్ని బలిదానం చేసి మన అందరికి చక్కని గుణపాఠం చెప్పాడు. ఎవ్వరూ ఉపవాసం చేయటానికి స్థలం ఇవ్వక పోతే అట్టలు కట్టుకొని వీధులలో తిరిగి ప్రాణాలైనా అర్పిస్తానన్న పట్టుదల మనిషి శ్రీరాములు. సాంబమూర్తి అతనికి ఆశ్రయం యిచ్చాడు. నెహ్రూ తలచుకుంటే శ్రీరాములు ఆదర్శం అతను బ్రతికి వుండగనే అమలు జరిగి వుండేది. నెహ్రూ తండ్రి నాకు తెలుసు. అతడు చాల మంచివాడు. నెహ్రూ కూడా బుద్ధి మంతుడే అయితే ఈ సందర్భంలో న్యాయంగా వర్తించలేకపోయాడు".

తెలుగు పత్రికలు శ్రీరాములు గారి త్యాగాన్ని వర్ణించుటకు సరి అయిన పదజాలం దొరకక కాబోలు "సుప్రీం శాక్రి ఫైస్" అని వ్రాశాయి.

శ్రీరాములును వీరరాజ తపస్విగా అభివర్ణిస్తూ మద్దూరి అన్నపూర్ణయ్యగారు తన సంపాదకీయం (''వెలుగు'' 15- 12- 53)లో ఇలా వ్రాశారు.

'' శ్రీరాములు ఆత్మార్పణము రణరంగమున మృత్యువును దునుము ప్రయత్నమున తానే వీర స్వర్గము నలంకరించుట వంటిది కాదు. శత్రు తుపాకి గుండుకు తన గుండెనిచ్చి వీర మరణము నొందుట వంటియు కాదు. ఇది కేవలము స్వచ్ఛంద మరణము. పై అన్ని మరణములలోను ప్రాణము క్షణమాత్రమున పోవును. కాని శ్రీరాములు సమాధి చేరినదంత సులభ మార్గమున కాదు. బుద్ధి పూర్వకముగ 58 రోజులు నిరాహార వ్రత దీక్షను కొనసాగించి ప్రతి నిమిషము మరణ వేదననుభవించుచున్నను చిరునవ్వును బాయక నిరంతరము మృత్యు దేవతతో హోరాహోరి సిద్ధిపొందిన వీర తపస్వి మన పొట్టి శ్రీరాములు''.

# 19. ఆంధ్రలో ఆరని జ్వాలలు




శ్రీరాములు గారి నిర్యాణవార్త ఆంధ్రదేశంలో దావానలంలా వ్యాపించింది. ఎక్కడి రైళ్లు అక్కడే నిలిచిపోయాయి. ఎక్కడ చూచినా హర్తాళ్లే! సమ్మెలే! ప్రదర్శనలే! పాఠశాలలు, కోర్టులు వాటంతట అవే మూత పడ్డాయి. పోలీసులు పలుచోట్ల లాఠీ ఛార్జీలు, కాల్పులు జరిపారు.

ఈ ఉద్యమంలో ఆంధ్ర విద్యార్థులు ప్రముఖ పాత్ర వహించారు. అప్పట్లో "డెమోక్రటిక్ స్టూడెంట్సు యూనియన్" విద్యార్థులలో పలుకు బడి గలిగి వుండేది. ఏలూరు రైలు స్టేషనులో ఈ యూనియన్ వారే శ్రీ వి. వి. సుబ్బారావు నాయకత్వాన ఆంధ్రకేసరి ప్రకాశం గారిని "ఘెరావ్ చేసి తమకు నాయకత్వం వహించమని కోరారు.

ఆంధ్ర యూనివర్సిటీ విద్యార్థులు, డెమోక్రేటిక్ స్టూడెంట్సు యూనియన్ అధ్యక్షులు ఎ.వి.కె.చైతన్య అధ్యక్షతన గొప్ప సభ జరిపి ఆంధ్రకేసరి ప్రకాశం గారి ప్రసంగాన్ని ఏర్పాటు చేశారు.

రాజమండ్రిలో మద్దూరి అన్నపూర్ణయ్య, డాక్టర్ ఎ.బి. నాగేశ్వరరావు గార్లు రైలు ఇంజను పై నిలబడి వేలాది ప్రేక్షకులను ఉద్బోదించారు.

వాల్తేరు స్టేషనులో జరిగిన పోలీసుకాల్పులలో యాభైమందికి గాయాలు అయినాయి. ఒక మహిళ చనిపోయింది.

ఈ ఉద్యమంలో వివిధ ప్రాంతాలలో 12 మంది ప్రాణాలు కోల్పోయారు. నెల్లూరులో మరణించిన ముగ్గురు వ్యక్తుల మృతదేహాలతో తొమ్మిది మైళ్లు ఊరేగింపు జరిపారు. ప్రభుత్వ చర్యకు నిరసనగా తెన్నేటి విశ్వనాథం ప్రభృతులు శాసన సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. మహామహులెందరో ఆయనకు నివాళులర్పించారు. మా గాంధీ కుటుంబ సభ్యులొకరిని కోల్పోయాం.

-ఆచార్య వినోబాభావే

శ్రీరాములు గాంధీని మించిన త్యాగం ప్రదర్శించినాడు.

-ఆంధ్రకేసరి ప్రకాశం

గాంధీజికి శ్రీరాములు ముఖ్య శిష్యుడు. సన్నిహిత సహచరుడు.

-మహర్షి బులుసు సాంబమూర్తి

ఆయన తన సిద్ధాంతం ఆచరణలో యదార్థ సత్యాగ్రహి అనిపించుకున్నాడు.

-స్వామి సీతారాం

వీర రాజతపస్వి - బెజవాడ గోపాలరెడ్డి

ఆయన చితాభస్మం నుండి పలువురు అహింసావీరులు జన్మించి ఆయన ఆశయం సాధిస్తారు. -సాధు సుబ్రహ్మణ్యం.

# 20. ప్రధాని నెహ్రూ ప్రకటన: రాష్ట్ర అవతరణ

ఉవ్వెత్తున లేచిన ఆంధ్రోద్యమ ప్రభావం ఢిల్లీలోని పార్లమెంటుపై బడింది. ప్రధాని పండిట్ జవహర్ లాల్ నెహ్రూ 19.12.52న వివాదం లేని తెలుగు జిల్లాలతో ఆంధ్ర రాష్ట్రం మద్రాసు రాష్ట్రం నుండి విడగొట్టబడుతుందని ప్రకటించారు. రాజస్థాను హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కె. ఎన్. వాంఛూ రాష్ట్ర నిర్మాణ విషయమై నివేదిక సమర్పించటానికి నియమితులైనారు. 1953 జనవరి 5న ఉత్తర్వులలో నియమితుడైన వాంఛూ జనవరి 7 నుండి తన పని ప్రారంభించారు. శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం, కడప, చిత్తూరు 11 జిల్లాలతో పాటు బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గం నూతన రాష్ట్రంలో చేర్చాలని వాంఛూ నివేదికలో పేర్కొన్నాడు.

వాంఛూ నివేదికను ఆమోదించిన కేంద్ర ప్రభుత్వం 1953 మార్చి 25న ప్రకటన చేస్తూ నూతన ఆంధ్రరాష్ట్రం 1953 అక్టోబరు 1న ప్రారంభించనున్నటు ప్రకటించింది.

ఆంధ్ర శాసన సభ్యులంతా మద్రాసులో ఆంధ్రకేసరి ప్రకాశం అధ్యక్షతన సమావేశమై నూతన రాష్ట్రానికి రాజధానిగా కర్నూలు నిర్ణయించారు.

ఆంధ్ర ప్రజల ప్రియతమ నాయకుడు ప్రకాశం తొలి ముఖ్యమంత్రిగా ఉండవలసిందని ప్రధాని నెహ్రూ సూచించారు.

1953 అక్టోబరు 1న ప్రకాశం ముఖ్యమంత్రిగా కర్నూలులో ఆంధ్ర రాష్ట్రాన్ని ప్రధాని స్వయంగా ప్రారంభించారు. వైస్ ప్రెసిడెంట్ రాధా కృష్ణన్ ఆ సభలో పాల్గొని శుభాకాంక్షలు తెలిపారు.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమైన కొద్ది కాలానికే భాషా ప్రాతిక్రపై దేశాన్ని విభజించాలని ఆలోచన వచ్చింది. దీనికోసమే ఫజల్ ఆలీ కమీషన్ ఏర్పాటయింది. వారి సిఫార్సులు ఆధారంగా నిజాం సంస్థానంలోని తెలుగు జిల్లాలను ఆంధ్రతో కలిపి హైదరాబాదు కేంద్రంగా విశాలాంధ్ర (ఆంధ్రప్రదేశ్) ఏర్పడింది. దీనికి ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ గారే ప్రారంభోత్సవం చేశారు. తన ముఖ్యమంత్రి పదవి పోతుందని తెలిసి కూడా తెలంగాణా ప్రాంతం ఆంధ్రలో చేరడానికి కృషి చేసిన మహనీయులు బూర్గుల రామకృష్ణారావుగారు. ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి అయ్యే అవకాశం శ్రీ నీలం సంజీవరెడ్డికి లభించింది.

దేశంలో భాషా రాష్ట్రాల ఏర్పాటుతో భారతదేశ రాజకీయ చిత్రపటమే మారిపోయింది. ప్రజల భాషలో పాలన నడుస్తూ ప్రజాస్వామ్య పునాదులు బలపడినాయి.

ఆంధ్ర రాష్ట్రానికే కాదు. భారతదేశంలో భాషా రాష్ట్రాల నిర్మాణానికి కూడా కారకుడయిన మహనీయుడు పొట్టి శ్రీరాములు. ఆంధ్రులకే కాదు, దేశ ప్రజలందరికీ ఆయన ప్రాతః స్తవనీయుడు.

ఆంధ్ర భాషా సంస్కృతి పరిరక్షణకు ఏర్పాటైన తెలుగు విశ్వ విద్యాలయాన్ని ఇటీవల పొట్టి శ్రీరాముల పేర వెలయింప చేసిన ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు అభినందనీయుడు.

ఆంధ్ర అవతరణగూర్చి రాజమండ్రి నుండి వెలువడిన 'వెలుగు' 6- 1053 సంచిక ఇలా వ్రాసింది.

''నెహ్రూకు ఆంధ్రకేసరికి వుభయులకు కర్నూలులో బ్రహ్మాండమైన స్వాగతం ప్రజలిచ్చారు. రాజకీయ వివాదాలు ఎన్నివున్నా వ్యక్తుల ఘనతలను, త్యాగాలను బట్టి ప్రజలు వారిని పూజిస్తారా అనిపించింది. నెహ్రూ ఉపన్యాసాలు అన్నీ చక్కగానే వున్నాయి. '' ఆంధ్రకేసరిని నేను ప్రత్యేకంగా ఆహ్వానించి ప్రభుత్వాన్ని యేర్పాటు చేయమన్నాను. ఆయన నాకంటే వయస్సులోను ప్రజా సేవలోను వయోవృద్ధుడు. ఆంధ్ర ప్రభుత్వం అతని సారధ్యం క్రింద ఆంధ్ర అభ్యుదయానికి సహకారి యగును''. అని శలవిచ్చాడు. భారత యూనియన్ ఉపాధ్యక్షుడు డాక్టర్ రాధాకృష్ణన్ స్వర్గీయ దేశభక్త కొండ వెంకటప్పయ్య దేశోద్ధారక నాగేశ్వరరావు ప్రభృతుల ఆంధ్రోద్యమ సేవ నుగ్గడించి వారీ శుభ సమయమున లేక పోయినందుకు విచారాన్ని వెలిబుచ్చారు. కుమారి టంగుటూరి సూర్యకుమారి తెలుగుతల్లి పాట కడు హృద్యంగా పాడింది.

పొట్టి శ్రీరాములు ఆత్మబలిదాన ప్రశంస లేకుండా అధికారిక అవతరణ మహోత్సవం జరిగిపోవడం మిక్కిలి శోచనీయం.''

కానీ సాధు సుబ్రహ్మణ్యంగారు కర్నూలు గుడా రాల రాజ్యంలో అమరజ్యోతి దీపస్తంభ ప్రారంభోత్సవం సర్వోదయ నాయకులు ప్రభాకర్‌జీతో చేయించడం ముదావహం.

## 21 పొట్టి శ్రీరాములు మిషన్

పొట్టి శ్రీరాములుకు శ్రద్ధాంజలి ఘటించడానికి మద్రాసులో 1952 డిసెంబరు 19న ఒక బహిరంగ సభ జరిగింది. ఆ సభలో ''పొట్టి శ్రీరాములు మిషన్'' ఆవిర్భవించింది. డిశెంబరు 22న మరొక సభలో ఆంధ్రకేసరి ప్రకాశం ''పొట్టి శ్రీరాములు మిషను'' లాంఛనంగా ఆవిష్కరించారు.

ఆంధ్రకేసరి ప్రకాశం ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి పదవి నుండి వైదొలగే ముందు పొట్టి శ్రీరాములు ఆమరణ నిరాహారణ గావించిన మైలాపూర్‌లోని 126 నెంబరు ఇల్లు స్మారక మందిరంగా వుంచడానికి గాను రాష్ట్ర ప్రభుత్వం కొనుగోలు చేయాలని తీర్మానం ఆమోదించారు.

పొట్టి శ్రీరాములు జయంతి, వర్ధంతులను ఈ సొసైటీ ప్రతి ఏటా వైభవంగా నిర్వహిస్తూ స్మారకోపన్యాసాలను ఏర్పాటు చేస్తున్నది. పొట్టి శ్రీరాములు కాంస్య విగ్రహం ప్రతిష్ఠింపబడి ఆ మందిర మొక దేవాలయం వలె విరాజిల్లుతున్నది. స్మారక భవనం పునర్నిర్మాణానికి లక్షల రూపాయలు నిధులు సమకూర్చిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారాచంద్రబాబు నాయుడు అభినందనీయుడు.

పొట్టి శ్రీరాములు మెమోరియల్ సొసైటీ నిర్వహించే గ్రంథాలయంలో పరిశోధకులకు ఉపయోగపడే రీతిలో పత్రికలు గ్రంథాలు భద్రపరచబడినవి. మద్రాసులో తెలుగు సాహితీ సంస్థలన్నిటికీ ఇది చక్కని వేదిక గానే గాక ఆంధ్రదేశం నుండి చెన్నై దర్శించేవారు తప్పక దర్శించదగిన పర్యాటక స్థలంగా కూడా విలసిల్లుతున్నది.

మిషను స్థాపితమైనప్పటి నుండి కార్యదర్శిగా వుంటూ ఎనలేని సేవ చేస్తున్న నిష్కామ యోగి శ్రీ వై. యస్. శాస్త్రి ప్రశంసనీయులు.